# భారతీయత
# దాని నిజతత్త్వము





ద్వితీయ సంపుటము

శ్రీ అరవిందులు

# పరిచయము

శ్రీ అరవిందులు, తమ పెద్ద అన్న (శ్రీ మన్‌మోహన్ ఘోష్) గారియందు ఎంతటి భక్తి, వినయ విధేయతలతో మెలగిరో వారికి వ్రాసిన యీ వుత్తరమునందు విశదమగుచున్నది. సోదర ప్రేమయొక్క యదార్థమైన విలువలు శ్రీ అరవిందుల నిజ జీవితములో ప్రతిబింబించినవి. అవి మనకు మార్గదర్శకములు—

అయినను పాశ్చాత్య జీవితమునకు, నాగరికతకు అలవాటుపడి, ఆ సాంప్రదాయములనే జీర్ణింపజేసికొని; ఆ దృష్టితో హైందవ సాంప్రదాయ సంస్కృతులను, పురాణేతిహాసములను కించపరిచినట్లుగ వ్రాసిన వుత్తరమునకు సమాధానమే యీ పుస్తకమునందలి ప్రథమ భాగము.

శ్రీ అరవిందులు భారతీయతను సమర్థించుచు; వినయముతో యిచ్చిన సమాధానమునందు కూడ ఒక ప్రత్యేకత, వ్యక్తిత్వము, గంభీరతలు స్పష్టముగ గోచరించుచున్నవి. తద్వారా భారతీయ నిజతత్త్వమునందు, నిజధర్మమునందు శ్రీ అరవిందులకు యెంతటి ప్రగాఢానుభూతి గలదో సువిదిత మగుటయేగాక, భారతీయ సారస్వతమునందలి సూక్ష్మాతిసూక్ష్మములైన సజీవసత్యములను విపులీకరించుటను చక్కగ అర్థము జేసికొనవచ్చును.

రెండవది కళలు: దేశముయొక్క ఔన్నత్యతకు, విలువలకు యీ కళలే ప్రత్యక్ష నిదర్శనములనునది శ్రీ అరవిందులు యెంత చక్కగా వివరించిరో పాఠకులే గ్రహించగలరు. (ఈ వ్యాసము, లోగడ "భారతి" అను మాసపత్రికలో ప్రచురింపబడినది. వారి సౌజన్యముతో మరల ప్రచురించుచున్నాము. సం॥)

అమూల్యమైన యీ విషయములను ప్రత్యేక శ్రద్ధ తీసికొని, సరళమైన భాషలో చక్కగా అనువదించి; భారతీయ ఐతిహాసికమునందలి అగాధ సత్యములను శ్రీ అరవిందులెంత సునిశితముగా గ్రహించిరనునది తెలుపుటకు తోడ్పడిన డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం, ఎమ్. ఏ., పి. హెచ్‌డి., (ఆంధ్ర విశ్వకళాపరిషత్, పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్, గుంటూరు) గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు. వారి భాషా వైదుష్యమును గురించి వేరే వ్రాయపనిలేదు. దానికదే సాటి. తద్వారా శ్రీ పురుషోత్తంగారు తెలుగు వారికి గొప్ప సేవ చేసిరనుటలో సందేహము లేదు. ఇలాంటి అనువాదములను సహృదయులైన రచయితలు తరచు పంపుచు శ్రీమాతారవిందుల దివ్య సందేశవ్యాప్తికి తోడ్పడుదురని విశ్వసించుచున్నాము.

పుదుచ్చేరి-605002

15-8-1974

తెలుగుశాఖ

శ్రీ అరవిందాశ్రమము

---

The more ancient sculptural art of India embodies in visible form what the Upanishads threw out into inspired thought and the Mahabharata and Ramayana portrayed by the word in life.

—SRI AUROBINDO

# వి ష య సూ చి క



1908 సం॥ లో శ్రీఅరవిందులు. (జాతీయ కళాశాల, కలకత్తా)

# మేలుకొనర!!

మేలుకొనర జీవా!
ఆలోకింపర త్రోవ!!

అరుణారుణ కాంతులతో
'అర్క' బింబ ముదయించెను
అరవిందము వికసించెను
తరులన్నియు హసియించెను॥ ॥మేలుకొనర॥

మాతృశ్రీ మధురవాణి
గాత్రము పులకింపఁజేసె;
సత్యాన్వేషణ సల్పగ
నిత్యము చైతన్యమొదవె॥ ॥మేలుకొనర॥

అరవిందము నుపాసించి
నిరవధి సుఖశాంతి నంది
తరియింపగ నిదే మంచి
తరుణమోయి! భరతపుత్ర!! ॥మేలుకొనర॥

అతిమానసికాభివ్యక్త
మతి నిర్మలకాంతి పథము—
'మతిమంతుడు' దారిచూపె
గతి తప్పక గమియింపుము॥

మేలుకొనర జీవా!
ఆలోకింపర త్రోవ!!

# మన సంస్కృతి సౌధము

(శ్రీ అరవిందుల కాళిదాసు ప్రథమ సంపుటి ఆధారంగా)

ధర్మ సందీపితము
వాల్మీకి ఋషి కవిత;
వ్యాసముని భారతి మ
నీషా ప్రభావితము॥

అసమానుఁడౌ కాళి
దాసకవి సత్కృతులు
రస సముజ్జ్వలనమై
ప్రసరించు తేజమ్ము॥

పాత్రలందు తాను స
ర్వత్ర లీనమౌ నొకండు;
పాత్రకొక వినూత్న శక్తి
పాత్రత గల్గించు నొకడు॥

కథా కథనమందు నూత్న
విధమగు పంధాను బట్టి
శిల్ప గరిమతో ననల్ప
కల్పన గావించు నొకడు॥

తన్ను గారవింప గోర
డెన్నడు వాల్మీకి సుకవి;
తన రాముని భజియించుటె
ఘనతరముగ ఆతడెంచు॥

తాను జెప్పినదియె వేద
మని వ్యాసుఁడు శాసించును;
తన్ను పూజచేసి, జాతి
ఉన్నతి సాధించుమనును॥

తన కావ్యములన్ పఠించి
ఘన రస స్రవంతి మునిగి
తనరారగ ధార్మికులై
మనలఁ గోరు కాళిదాసు॥

మూడంతస్తులతో గూడిన
మేడ మనదు సంస్కృతిగా
ముచ్చటించి రరవిందులు
నిచ్చట సందర్శింపగ॥

ఒక దానిని మించి వే
ఱొకటి ప్రకాశించు కతన
సకల మానవాళి మనో
వికాసమ్ము విస్తరించు॥

నాల్గవ యంతస్తు కూడ
కల్గియుండ దగు నయ్యది
జగద్గురువు శ్రీ శంకర
భగవత్పాదోజ్వలనము॥

అయ్యది ఆధ్యాత్మికమై
అలరారం దగునుగాని
కలసిపోయె నీ మూడిట
కలిమి బలిమి సమకూర్చుచు॥

భరతజాతి ఆధ్యాత్మిక
భావనకే నవజీవన
మార్గమ్మును జూపినట్టి
భర్గుడు శ్రీ జగద్గురుడు॥

మన సంస్కృతి, మన భావన
మన జాతికి గల విశిష్ట
తను తగ గుర్తించుటయే
మనకు ప్రథమ కర్తవ్యము॥

దీని విస్మరించు జాతి
కేనాడు విముక్తి రాదు;
ఉన్న కీర్తి సన్నగిల్లు;
మన్నింపరు జగజ్జనులు॥

# పురాణగాథల ఆంతర్యము

నా సహోదరునకు —

నీజాబు నాకు కొలదికాలం క్రితమే చేరింది. అది ప్రస్తుతం నా యెదుట లేకపోయినా జ్ఞాపకమున్నంత మేరకు సమాధానం రాస్తాను. హైందవపురాణాలు ప్రయోజనాత్మకాలు కావని; అభిరుచి రహితాలని; క్షుద్ర భావోపేతాలని; గతానుగతిక భావాల కాశ్రయాలని; నిస్సంకోచంగా అందులో నిందింపబడినట్లుమాత్రం నాకు జ్ఞాపకముంది. ఈ నిందలో గమనింపదగిన ప్రధానాంశం— హైందవ పురాణాలు సహజమైనవికావని; మానవతా ప్రతిపాదకాలు, నిరాడంబక భావోపేతములు కావని; వీనిలోని పాత్రలు ఉన్నత నైతికస్థాయికి నిర్జీవాదర్శ మూర్తులనికూడా నీ యభియోగమైనట్లు ద్యోతకమౌతుంది.

ఇన్నాళ్ళు, నీ యభిరుచులు, నిర్ణయాలు నిర్దుష్టమైనవని, తిరుగులేనివని భావిస్తుండేవాడ్ని. ఏదో కొంత సంకోచంతోనే ఇప్పుడు నీతో నేను భేదిస్తున్నాను. నీవు ఘాటుగా నిందించిన విషయాన్ని సమర్థించటానికి; హైందవ తత్త్వోద్రేకంతో, హైందవ నియమాభిరుచుల కనుకూలంగా, తత్తదుచిత శైలిలో విరచితమైన కావ్యాన్ని; అట్టి విషయాన్నిగూర్చి అత్యంత జుగుప్సాభావంగల నీకు నేను అంకితంచేయటానికి ఎందుకు సాహసించానో వివరించటానికి అనుమతిస్తావనుకొంటాను. నిన్ను ఒప్పించటానికి నేను ప్రయత్నించటంలేదు, నన్ను నేను సమర్థించుకోటానికి; కనీసం నా దృక్పథాన్ని నిర్వచించటానికి ప్రయత్నిస్తాను. నేనెన్నుకొన్న కవితాకళలో నాకు పునర్వికాసం కల్గటానికికూడా నా యీ ప్రయత్నం పనికిరావచ్చు.

గ్రీకు నాగరకతా సంప్రదాయ మధుపాన మత్తతవల్లనే నీకీ హైందవ పురాణాలపై ఇటువంటి అనివార్యమైన హేయభావం కల్గింది. ఎందుకంటె గ్రీకు బాహ్య సంకుచిత సౌందర్యభావన, హైందవ తత్త్వానికి వ్యతిరిక్తమైంది. విస్తృత విశ్వజనీన మానవభావనకు పరిధిని కల్గించేది హిందూ తత్త్వం. అనంత నిరాకారానికి దారితీసేదిది. వాస్తవికాదర్శాలకు రెంటికి దూరమైన హైందవభావనలోను, ఊహల్లోను గ్రీకు నాగరకతా లక్షణాలు కొన్ని పొడగట్టకపోవు. అట్టివాని ఆధారంతో హైందవపురాణాలన్నీ అటువంటివేనని నిందించటం సహజం. ఈ లోపమే దాని కనివార్యమైన ప్రత్యేక లక్షణమౌతుంది. ఎందుకంటె, తీవ్ర సూక్ష్మకలంక సుకుమారాభిరుచుల్లోను; విమర్శన నిర్ణయాల్లోను, ప్రమాణికతను పరిరక్షించుకోటానికి గ్రీకు నాగరకత, అన్యనాగరకతా సహిష్ణువు కాకతప్పదు. తన హద్దుల్లోనే యితర నాగరకతలుకూడా వుండాలని అది ఆదేశిస్తుంది. తన్ను అతిక్రమించిన భావనను అమానుషమని, అసహ్యమని అది త్రోసిపుచ్చుతుంది. భిన్న భిన్న సన్నివేశాల కనుకూలంగా నిత్యం అభివృద్ధి పొందుతు, కళాత్మకానుభవాలతో పరిణతిచెందుతు, స్వభావ కుతూహలాయత్త సంజనిత సానుభూతి నీ నాగరకత త్రోసిపుచ్చుతుంది. హైందవ నాగరకతకున్న సర్వతోముఖ దృక్పథం; గ్రీకు స్వభావానుకూల సంకుచిత నాగరికతా సౌకుమార్యాన్ని భంగింపచేస్తుంది. కాబట్టే దాన్నిది త్రోసిపుచ్చుతున్నది. ఇది బాగానేవుంది. గ్రీకు నాగరకత అంత సుకుమారం కాకపోయినా, హైందవనాగరకత బహుముఖీనమైంది. నిరంతరం ఆదానప్రదానాల కవకాశమిచ్చేవి హైందవ కళా విమర్శలు. అందుచే వీనిలో తరచుగా అభినవాభిరుచి కుంటువడి, శకలమై, అనిశ్చిత రచనకు దారితీస్తుంది. ఒక్కొక్కప్పుడు అఖండ విజయాన్ని సంపాదించి, కవితా కళకుపకరించే క్రొత్త కళాస్వరూపాల్ని సంతరించుకొంటుంది. లేదా వినూత్న కవిత్వానుభవాల్ని చేకూరుస్తుంది. పూర్తిగా అవివేకంగా

కాకపోయినా, తన ఘనతకే సదా అజ్ఞానంతో కూడిన సంతృప్తి ననుభవించటంతోపాటు దాన్నే యితరత్ర అన్వేషించుకొనే స్వభావంగల గ్రీకు నాగరకత, హైందవ పురాణాల్నిగూర్చి ఎట్టి నిర్ణయం చేయగల్గుతుంది?

రెండు రకాల పురాణకథల్ని నేను జాగరూకతతో విచక్షిస్తాను. 1. మత, వేదాంతపరమైన ద్వంద్వార్థగాథలు. 2. మతాతీత వాస్తవికగాథలు.

మొదటి తరగతి గాథలు తర్కాతీతమైనవి. అన్వర్థదాయకములైన సంకేతాలతో గూడిన మధ్యకాలపు హిందూమతతత్త్వాన్ని ప్రతిబింబించే ఈ పురాణగాథలు ఒక విధమైన విచిత్రమనస్తత్త్వాన్ని ఉద్దేశించిన కవితగా రూపొందాయి. పాశ్చాత్యభావనకీ యసాధారణ పురాణకవిత వెగటుగా తోచింది. దీనితో ప్రాక్ప్రతీచీ విభేదాలు శాశ్వతంగా ఏర్పడ్డాయి. ఈ విభేదం మౌలిక స్వభావానికి సంబంధించింది. అందుచేత వీనిని సమన్వయించటం సాధ్యపడదు. ఇటువంటి పాశ్చాత్య మానసికప్రవృత్తి భావుకమైన మతాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. అసలు మతాన్నంటు అది అంగీకరిస్తే, అది విశద మూఢవిశ్వాసాత్మకంగా ఉండాలంటుంది. అట్టి మనస్సుకు సంకేతాత్మక పురాణగాథలు అసత్య శుష్క కళాప్రలాపాలుగా గోచరిస్తాయి. దీనికి విభిన్నమైన మనఃప్రవృత్తి వేరొకటుంది. అది ఆధ్యాత్మిక మతోన్ముఖమైందేకాక, వివిధ సంకేతాత్మక వాతావరణ సంవృతమైన మత భావుకతతో సమ్మిళితమై సంకుచిత మత విశ్వాసంనుండి రక్షించేదిగాను వుంటుంది. అంతేకాక, ఇట్టి భావనకు, అంధ విశ్వాసానికి అతీతమై, విశ్వాస రహిత మహోన్నత శిఖరాల నధిష్ఠించి వుంటుందీ మనఃప్రవృత్తి. ఇట్టి మనఃప్రవృత్తి గలవారికీ హైందవ పురాణగాథలపట్ల ఆదరాభిమానాలధికంగా వుంటాయి. అవి అట్టివారికి శాశ్వతానంద వికాసాలు ప్రసాదిస్తాయి. అట్టి మనస్తత్త్వం గలవారికీ హైందవగాథలు శక్తిమంతంగాను, ప్రబోధనాత్మకం

గాను వుంటాయి. ఒక్కొక్కప్పుడివి ఇతిహాస సాహస భావనకుకూడా దారి తీస్తాయి. ఇవి ఔచితీవిలసిత సత్యాన్వేషణోత్సుకతను, సౌందర్య కౌతూహలాన్ని సమకూర్చుతాయి. ఈ హైందవ పురాణగాథల్లో అభివ్యాప్తమైన వినూత్నతే వాని జీవగఱ్ఱ. ఇది యూరోపియనులకు అసంబద్ధ వినోద భావ వినూత్నతగా గోచరిస్తుంది. కాని మనకుమాత్రం ఆ వినూత్నత సహజము. సరసము అయింది. ఇట్టి వినూత్నతను హైందవగాథల్నుండి వైదొలగించటం వానిని నిర్జీవం చేసినట్లే. ఈ వివాదం కేవలం నిష్ఫలమైంది కాబట్టి యింతటితో దాన్ని విడిచిపెడదాం.

ఇంక మతప్రసక్తిలేని గాథల విషయం విచారిద్దాం. ఇవి చాలవరకు విపరీతాసహ్య వికృత భావోపేతమైనవి. ఈ వికృతభావనే వాని ప్రధాన లక్షణంకాదు. ప్రతిపాదన విధానం ప్రధానమైంది. కథాప్రతిపాదనం హైందవతత్త్వానికికూడా ముఖ్యమైందే. కాని అదొక్కటే అందులో ఆత్మానుభవాన్ని చేకూర్చే చరమలక్షణంకాదు. ఈ మతాతీత గాథలు క్షీణ యుగంలో రచింపబడ్డాయి. నేటి వీని స్వరూపం హటాత్సంభవం. వ్యాసుని మహాభారతం మొదట్లో 24వేల శ్లోకాలతో కూడింది. ఆ తరువాత అది లేఖక కవుల హస్తాల్లో విస్తృతమైంది. కడకు కళావిహీనమైన అధమరచనలెన్నో అందులో తావు చేసుకొన్నాయి. ఇట్టి పరిస్థితుల్లోనే హైందవగాథలనేకం తామరతంపరగా ఈ దేశంలో ఉత్పన్నమైనాయి. నిరాడంబరము, నిస్తుల సౌందర్యోపేతమునైన మన ప్రాచీన గాథలెన్నో సక్రమంగా సంరక్షితంగాని కారణంగాను; నిరంతర నిస్సార కథాకల్పనా సాంగత్యంవల్లను, కళావిహీన వికృతాకృతి వహించాయి. అయినా భారతీయ మహేతిహాసాలు, హైందవ స్వభావోచితమైనవే. అనంత శక్తిసామర్థ్యాలు కలవివి. మధురమైనవి. అనంతరకాలంలో రససిద్ధులైన మహాకవుల హస్తాల్లో నాటకాలుగా మహాకావ్యాలుగా ఇందులోని యితివృత్తాలు సుకుమారోదాత్త శిల్పకళాకృ

ARA

తిలో వికసించాయి. మహాభారతంలోని నిర్జీవము, నిస్సారమునైన శకున్తల కథ కవికుల గురువగు కాళిదాసుని మధురహస్తాల్లో రసవత్తర రూపకాకృతిని వహించి అతని రచనలన్నింటికి తలమానికమై సహృదయ హృదయైక వేద్యమై పరాకాష్ఠకెక్కింది. దీన్నిబట్టి కవుల హస్తస్పర్శలో ఒకే యితి వృత్తం ఎంత విభిన్నాకృతి వహిస్తుందో నిర్ణయించవచ్చు.

నీవన్నట్లు హైందవ పురాణానికి గ్రీకు పురాణానికున్నంత సముత్సుకతా చైతన్యం కానరాదు. భారతీయ మనఃప్రవృత్తి నైతికంగా నిష్ఠురమైంది; ఆదర్శోపేతమైంది. అందువల్ల అది ఉద్రిక్తతకు సౌకుమార్యానికి విశేషావకాశాన్ని చేకూర్చదు. అంతేకాక, ధర్మాధర్మాల్ని, పుణ్యాపాపాల్ని నిరూపించే అనూచాన కవిత్వాడంబరత్వానికి కూడా ఇది అనుకూలమైంది కాదు. 'ఇడిపస్సు'లుగాని, 'అగమెమినాన్లు' గాని భారతీయ సృజనాత్మక శక్తికి సుదూరంగా నిలిచేవాళ్ళే.

పైని పేర్కొన్నట్లుగా, హైందవ పురాణాల్లో ఉన్న లోపం పూరింపరానిదని బహుశః నీవు భావించవచ్చు. కాని దాన్ని స్పర్థతో అతిక్రమింపగల వాస్తవిక విలక్షణశక్తి హైందవ పురాణాలకున్నదని భావించే మనస్తత్త్వం గలవారిలో నేనొకణ్ని. చైతన్యం, బాహ్యాకర్షణ, భౌతికాభిరుచి అనే లక్షణాలు గ్రీకు సాహిత్యానివి. ఇవి హైందవ సాహిత్యంలో లోపించవచ్చు. అయినప్పటికి, వీనికన్న మిన్నగా భావింపబడే ఆధ్యాత్మిక సౌందర్య సముద్దీపనం భారతీయ సాహిత్యంలో ప్రస్ఫుటమౌతుంది. భూమి ఉపరితలాన్ని ఆవరించిన సౌందర్యాన్నేకాక, లోలోతుల్లో నిగూఢంగావుండే సౌందర్యపు పొరల్ని విశ్లేషించి, క్రమక్రమంగా తీవ్ర భావోజ్జ్వల సముద్దీప్తితో పరిభ్రమించి, ఆకాశంలో గోచరంగాని ఆదర్శభావ పరిక్రాంత విన్యాసాల్ని అన్వేషిస్తుంది భారతీయసాహిత్యం. ఇంకా విశదీకరిస్తాని విషయాన్ని. గ్రీకు.

భారతీయ స్వభావాలు భిన్నమైనవి. గ్రీకుస్వభావం ప్రాణశక్తి కాగా, భారతీయుల స్వభావం తదతీతశక్తి. మొదటిది భౌతికమైతే రెండవది ఆధ్యాత్మికం. తొలిది విషయసుఖ పరిమితమైంది. మలిది విషయాతీత సుఖానుభూతి కలది. తొలిదాని ప్రకారం సూర్యుడు ప్రకృతిగతమైన వస్తువు మాత్రమే. దాని వెలుగు ఆనందదాయకం కాకతప్పదు. కాని భారతీయులకో! సూర్యుడు జడపదార్థంకాదు సరికదా! ఆతడో భగవానుడు; సత్యాన్వేషణ తత్పరతతో అహరహం ఆరాటించే భారతీయ మనఃప్రవృత్తికి హిరణ్మయ పాత్రతో సత్యాన్ని అపిహితమొనర్చిన మహాసంరక్షకుడుగా ఆతడు గోచరిస్తాడు. మనల్ని ఆవరించిన ప్రకృతిలోని ప్రత్యంశాన్ని గ్రీకులు అనుభవిస్తారు. కాబట్టి వీరు పరిమితము, పరిచ్ఛిన్నమునైన పూర్ణత్వాన్ని ఆశిస్తారు. కాని భారతీయులు అనంత పరివ్యాప్త ప్రకృతిని భావించి దాని యుదాత్తతలో అవలీలగా విహరిస్తారు. ఈ విధమైన ప్రవృత్తి కవితా విషయికంగా ప్రమాదభరితమైంది. పరిమిత సౌందర్యం, సమతారూపం, ఎప్పుడూ ఆకర్షణీయమైనవి, కవితానుగుణమైనవి. అధమకవులు రచించినా, గ్రీకు పురాణగాథలు మానవసౌందర్యాన్నిగాని, సుఖదుఃఖాలనుగాని ఎంతో కొంత నిరూపింపకపోవు. కాని అనంతత్వాన్ని స్పర్శించే నేర్పు అందరు కవులకు అలవడే గుణంకాదు. అది అందరికు ఆకలింపుకాదు. ఎంతో శక్తిసామర్థ్యాలుగల ఏ కొద్దిమందికోగాని అది సాధ్యపడదు. శక్తి హీనులకది బెడిసి కొడుతుంది; వికృతపు పొలిమేరల్లోకి విసరివేస్తుంది. ఈ విధంగా ఈ ప్రాచీన గాథల్లో స్థాయీభేదం ఎంతో పొడగడుతుంది. ఒకే గాథ ఆయా కవుల కళాకౌశల్య పేశలత్వాన్నిబట్టి భేదిస్తుంటుంది. ఒకటి ఉదాత్తశిఖరాల నధిష్ఠిస్తే, వేరొకటి అధోలోకాల్లో ఉంటుంది. ఉత్తమమా? అధమమా? అని నిర్ణయించటానికి వీలుపడని మధ్యతరగతి గాథలుకూడా కొన్ని వున్నాయి.

ప్రాచీనగాథల్లోని ప్రక్షిప్తాలను పరిహరించి, పరిశీలిస్తే, ఇప్పటికీ

అందులో ప్రకాశించే నిరాడంబర సౌందర్యం, ప్రజ్ఞాపాటవాలు నేటి భారతీయ కవుల కుపాధేయాలు కాకపోవు. ఈ విధమైన పరిష్కారం విదేశీయ భాషల్లో చేయటానికి ప్రయత్నించటం ప్రమాదకరమే.

నేనీ క్రింది కథాకథనంలో మన ప్రాచీనగాథ నొకదాన్ని ఆంగ్లప్రజానీకానికి ఆకర్షణీయమైన ఆహార్యంతో రూపొందింపచేసి అందించటానికి ప్రయత్నించాను. సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ మొదలైన వారిలాగా కేవలానువాదాని కుద్యమించలేదు. హైందవాంతరంగిక ధర్మాల్ని పరిపోషించటానికే ప్రయత్నించాను. అపరిచిత వస్తుస్వీకారంవల్ల ఎదురయ్యే గ్రామ్యలక్షణాల్ని పరిహరించాను. పౌరాణిక సంప్రదాయాలు, అభిరుచులు అపరిచిత సంస్కృతికి సుపరిచితం చేయటానికే ప్రయత్నించాను. ఇందులో అనేక కష్టనష్టాలు పతనాలు ఉన్నాయి. పాక్షికంగానైనా నేను విజయాన్ని సాధించానని నీవు భావిస్తే, నిజంగా ఎంతో తృప్తిచెందుతాను. విజయంకంటె అపజయమే తరచుగా సంభవించే ఇటువంటి ప్రయత్నాల్లో నా అపజయమే నాకు ఓదార్పు చేకూరుస్తుంది.

అనేక ప్రక్షిప్తాలతో కూడిన మహాభారతంలో రురు చరిత్రవుంది. అదేమంత పట్టయిన కథకాదు. అతి సాధారణమైంది. ఆంతరంగిక సౌందర్యం లేదందులో, అయినా అది మన పౌరాణిక కథల్లో అతి ముఖ్యమైందిగా భావింపబడుతున్నది. ఎందుకంటె అందులో కథకంటె భావం ప్రధానం. రురుని తాత 'భృగువు' వేదవాఙ్మయంలో గౌరవార్హుడు, పూజనీయుడు. ఆర్యచరిత్ర దేహళిలో నిల్చిన ఈ భృగుమహర్షి రూపం మనకు మసక మసకగా గోచరించినా, అత్యంత ప్రాచీనకాలంలో అతనిచుట్టు అజనిత గణాతీత జనానీకచ్ఛాయలు; అనేకోద్యమ సంప్రదాయాలు; అస్పష్ట మహావిప్లవాలు పరిభ్రమిస్తాయి. తరువాతి కథలో రాజసంతతి నంతమొన

ర్చిన ఈతని పుత్రుడు పరశురాముడు పవిత్ర ఋషి సంతతికి మూలపురుషుల్లో ఒకడౌతాడు. బ్రహ్మమానసపుత్రుడైన ఈ మహా తపోనిధి భృగువు పులోమ అనే అసురవల్ల చ్యవనుడనే కొడుకును కంటాడు. ఇతడు మాతృగర్భంలో ఉండగానే తండ్రి ఆత్మీయతను, మహత్తర తాపసిక శక్తిని అవర్జించుకొంటాడు. నాగరకతా జనకుడైన చ్యవనుడు కులపతి పీఠాన్ని అధిష్ఠించి సుప్రసిద్ధులైన అనేక వ్యక్తుల్ని సంసిద్ధం చేస్తాడు. ఊర్వశీ పురూరవులకు జనించిన ఆయువు ఈతని గురుకులంలోని బ్రహ్మచారే. ఆయువు చంద్రవంశపు మూలపురుషుడేకాక; ఇలా కులానికి కుదురుకూడా. ఈ వంశస్థులనేకులు భారతాంతర్గతమైన అంతర్యుద్ధాల్ని అణచి, చక్రవర్తులౌతారు.

చ్యవనపుత్రుడు ప్రమతికి, ఒకానొక అప్సరస మూలాన రురుడు జన్మించాడు. అతడ్ని గూర్చిందే యీ మన ప్రకృత కథ. తండ్రిలాగా ఇతడు తరువాత గొప్పమహర్షి అవుతాడు. కాని యితడు తన యౌవనంలో చిత్రరథుడనే గంధర్వరాజుకు, మేనకకు జనించిన ప్రమద్వర— అంటే శకుంతల కీమె అక్క— అన్నమాట; అనే అపార సౌందర్యరాశిని ప్రగాఢంగా ప్రేమించి భార్యగా స్వీకరిస్తాడు. కాని వారి అనుబంధం విశేషకాలం ఆనందదాయకం కాలేదు. పాపం! ప్రమద్వర, గ్రీకు గాథలోని 'ఇండిస్' లాగా సర్పదష్ట అవుతుంది. తన అర్ధాంగిని కోల్పోయిన రురుడు, దుఃఖోపశమనం పొందలేక పోతాడు. తాను తన ప్రియురాలితో సంచరించిన సాంద్రారణ్య గిరికుంజ ప్రదేశాలు సంచరిస్తూ, తన దుఃఖ తీవ్రతచే ప్రకృతినంతా దుఃఖమయం చేశాడు. కడకు దేవతలుసైతం అతని శోకోద్విగ్నతకు జాలిపడ్డారు. తన ఆయుర్దాయంలో సగభాగం అర్పిస్తే అతని అర్ధాంగి నతనికిస్తామన్నారు. ఇందుకు రురుడు సంతోషంగా అంగీకరించాడు. తన ఆయుయంలోర్దాని అర్ధభాగం చెల్లించి రురుడు ప్రమద్వరా పునస్సమాగమం పొందాడు. మహాభారతంతో అనుబంధింపబడిన కాలాంతర ప్రక్షిప్తాలను

పరిహరిస్తే, కథ ఈమాత్రమే. దీన్ని 'యురిడస్' కథతో పోలిస్తే, పైని వివరించినట్లుగా, హైందవ గ్రీకు పురాణ కవితా కళాకౌశల్యంలో గల తారతమ్యం విశదమౌతుంది.

'ఆర్ఫియస్' గ్రీకుపురాణాల్లో గొప్ప గాయకుడు. ఇతని భార్య 'యురిడస్'. ఈమెను విడిపించడానికి ఆర్ఫియస్ అంతర్లోకాలకు పయనిస్తాడు. ఆ లోకాధిదేవత 'హేడ్స్'. హేడ్స్ ఆలయంలోకి యితడు ప్రవేశించి, మృత్యువును తన సంగీతకళా ప్రాభవంతో జయిస్తాడు. తన ప్రియురాల్ని విడిపించుకొని పైలోకానికి విజయంతో వస్తుండగా, మానవ స్వభావోచిత దౌర్బల్యంవల్ల ఆమెను కోల్పోతాడు. ఈ విషాదాంత విషయాన్ని, అపరిమిత ఊహాశక్తితో, ఆర్ద్రహృదయంతో, కంపనోద్రేకంతో గ్రీకులు నిరూపించారు. హైందవకథల్లో ఇంతటి ఆర్ద్రత, వైవిధ్యం, విషాదాంత గాథానుకూల సౌకుమార్యం గోచరించవు. హైందవ కథకంతకు ఒకేభావం ఆధారం. అయినా ఆ ఒక్కభావం ఎంత ప్రబలమో!! మానవుడు తన అర్ధాయుష్షను నిష్ఠురంగా అర్పించుకొని, అర్ధాంగిని బ్రతికించుకోటం అనే దానిలోగల లోతైన రహస్యం అన్వేషింపదగిన అంశం. ఆలోచించేకొలదీ ఆశ్చర్యజనకంగా వుంటుంది. మానవ విధివిలాస కవాటాల నీ సంఘట్టన తట్టి తెరుస్తుంది. పరిమిత శక్తి నుండి అనంతము, అగాధమునైన ఆలోచనా జగత్తులోనికి మనల్నీ గాథ వాయువేగంతో తీసుకుపోతుంది.

నేనీ రురు కావ్యానువాదంలో సాధ్యమైనంతవరకు గ్రీకుల ఆర్ద్రతను, హైందవ సంయమన స్వభావాన్ని సమ్మిళితం చేయటానికే సాహసించాను. అయినా జాగరూకతతో హైందవతత్త్వాన్ని పౌరాణిక లక్షణాల్ని పరిపోషించాను. ఉదాత్తాదర్శ ఋజుభావోపేత హైందవపురాణ గాథాఫణితి, నియతమైంది. దాని పద్ధతిని మార్చే అవకాశం రచయితకు లేదు. నేను చెప్పేది

అందమైన గృహస్థ జీవితకథల్ని గూర్చి మాత్రం కాదు. పౌరాణికతను చేకూర్చేటప్పుడు గ్రీకు విధానాన్నిగాని, హిందూ విధానాన్నిగాని పూర్తిగా అ ను స రిం చ వ చ్చు. నేను అనుసరించిన పద్ధతి నీవు ఏమాత్రం మెచ్చేది కాదేమో! అని జంకుతున్నాను. హైందవ పురాణేతివృత్తం ద్వివిధాదర్శాల సంఘర్షణకు సంబంధించిందే అవుతుంది. అందొ కటి విశ్వజనీనమైంది. రెండోది తద్భిన్నమైంది. త్రిమూర్తులు మినహా ఇందులో మానవపాత్రలు, దేవతాపాత్రలుకూడా వుంటాయి. ఈ పాత్రలన్నీ చదరంగంలోని పావులవంటివే. విశ్వజనీన భావానుకూలంగానే అవి సంచ రిస్తాయి కాని స్వతంత్ర ప్రతిపత్తి కలవికావు. మొదటిది జీవితంలోని దేవతాదర్శం. ఇది రాక్షసాదర్శంతో సంఘర్షణ పడుతుంది. ఇదే రామా యణ కథాదర్శం లేదా ప్రభుత్వపరంగాను, సాంఘికంగాను, సకలశక్తులను కూడతీసుకొని, ఆత్మాయత్తం చేసుకొని, సుస్థిర విశాల సామ్రాజ్యస్థాపనం కావచ్చు. ఇట్టి సంస్థాపనంలో ప్రబల హింసాత్మక స్వతంత్ర స్వాధికార స్వామిభావాలతో కూడిన నిరంకుశాధికారాన్ని, ఆత్మసమర్పిత సమతా న్యాయాలు ఆధారంగా, ధర్మబలంతో ఎదుర్కోటం కావచ్చు. ఇదే మహా భారతంలోని కీలకం. లేదా సావిత్రి కథలోలాగా, ఒకానొక నారీమణి భీకర నిశ్శబ్దతతో, అఖండ శక్తిసామర్థ్యాలతో, ప్రాణాలపహరించే మృత్యువు నెదుర్కొనటమైనా కావచ్చు. కేవలం కుటుంబ కథేయనదగిన నలుని ప్రేమ గాథలోను, నైతిక పతనాన్ని అతిగమించే అత్యంత పవిత్ర దాంపత్యాను రాగం గోచరిస్తుంది. ఇదే క్షీణయుగ ప్రత్యేకలక్షణం. ఈ రీతిగానే, రురు ప్రమద్వరల కథలో ప్రేమాధిపతి కాముడు, మరణాధిపతి యముడు ప్రముఖ స్థానం వహిస్తారు. వారే నా యీ కావ్యశీర్షిక నలంకరిస్తారు.

హైందవ పురాణాదర్శాల్లోని రెండో ప్రముఖలక్షణం— నీవు ప్రత్యే కంగా నిరసించటాని కెన్నుకొన్నదైనా— నేను సమగ్రంగా అభిమానించింది.

హిందూ పురాణపాత్రలు మూసల్లో పోసిన నిర్జీవ నైతికమూర్తులని నీ అభిప్రాయం. ఈ విషయం తిరిగి విమర్శిస్తాను. మన పురాణాల్లోని ప్రముఖ పాత్రలు ఆదర్శోపేతాలు అంటే, ఆ ఆదర్శాలు కేవలం సదాదర్శాలే అనుకోరాదు, దురాదర్శాలుకూడా కావచ్చు. మిశ్రాదర్శ పాత్రలుకూడా లేకపోలేదు. ఇవన్నీ ఆదర్శ ప్రతిపాదక పాత్రగణాలు. హైందవ సృజనాత్మక స్వభావం ఆయా పాత్రల్లో నిహితమైన ప్రవృత్తుల్ని, ఉత్సాహాదర్శాల్ని, ఆశల్ని పరిశీలించటం మూలంగాను ఈ రీతి పాత్రచిత్రణం కల్గుతుంది. అయినా యివి ఉత్తమపాత్రలు. రాముడు, సీత, సావిత్రి కేవలం మూసల్లో పోసిన నైతికోన్నత మూర్తులేనా? నేను వారి కథల్ని వాల్మీకి వ్యాసమహర్షుల సజీవ భాషలో చదివి, వారి సుఖదుఃఖాలకు ప్రమోద సంచలనాల్ని పొందాను. అటువంటి నేను, నీ అభిప్రాయంతో ఏకీభవించలేను. నిజానికి, ఆ నిశ్శబ్ద ప్రబలహృదయ సావిత్రి, ఎంతటి శక్తిమంతురాలో! ఎంతటి సూక్ష్మ సునిశిత సుకుమార ఆత్మీయతారూపిణి!! ఎంతటి సజీవాకర్షణ పాత్ర!!! ఇక శ్రీరాముడో! ఆతడు తన ప్రతి చర్యలోను దివ్యతేజస్సు నుట్టిపడచేస్తాడు. సీతామహాసాధ్వి— మధుర మంజుల తేజస్స్వరూపిణి; మానవతా ప్రేమ పరిపూర్ణురాలు; స్త్రీ జనోచిత బలదౌర్బల్యాల కాలవాలమైంది. వీరు నిర్జీవ పాత్రలా? రురు ప్రమద్వరలుకూడా ఆదర్శపాత్రలే. వారిలో ప్రేమ పరాకాష్ఠ కెక్కింది. ప్రతి ప్రేమభావం వారి విస్తృత ప్రేమపరిధిలో ఇమిడి పోతుంది. అయినా ఇతరత్ర ఏ ప్రేమాదర్శం ఇంత సమగ్రంగా ప్రకటితం కాలేదు. ఆదర్శ ప్రేమ నిజమైన శక్తి. అది కేవలం కామంకాదు. కేవలం ఉద్రిక్తత కాదు. కేవలం ఆధ్యాత్మికతకాదు. అయినా యీ లక్షణాలన్నీ ప్రేమలో కనిపిస్తాయి. అప్పుడే ప్రేమస్వరూపం సమగ్రమౌతుంది. ఈ లక్షణాలన్ని పృథగ్భూతంగా పరిశీలిస్తే— కామం పాశవిక వాంఛ మాత్రమే అవుతుంది. ఉద్రిక్తత క్షణికమైంది. ఇక ఆధ్యాత్మికతో, దారితప్పిన మతాశయం. అయినప్ప

టీకి అత్యంతానురాగంలో ఇవన్నీ అంతర్భాగాలే. ఆదర్శప్రేమను చెట్టుతో పోలిస్తే; ఇంద్రియవాంఛ, వేళ్ళకు అత్యవసరమైన మట్టివంటిదౌతుంది. ఉద్రిక్తత చైతన్యాన్ని చేకూర్చే వాయువు. చెట్టువాడిపోకుండా సంరక్షించే ఎండ వానల వంటిది, ఆధ్యాత్మికత. ప్రేమకు, మరణానికి మధ్యగల ఆదర్శ సంఘర్షణను చిత్రిస్తున్నాను కాబట్టి దీనికి కవితాస్వరూపాన్ని చేకూర్చాలంటె రెండు విషయాలు ముఖ్యంగా కావాలి. మొదట ప్రేమస్వరూపాన్ని బాగా చిత్రించాలి. తరువాత మృత్యు స్వరూపాన్ని బాగా నిరూపించాలి. ప్రేమ చిత్రణం ఆదర్శస్థాయిలో వుండాలి. అది భౌతికంగాను, మానసికంగాను, ఆధ్యాత్మికంగాను శక్తిమంతంగా కదముట్టాలి. మొట్టమొదట భౌతికప్రేమను సరియైన ప్రాతిపదికమీద పరిపోషించాలి. మానసికోద్రిక్తతవల్ల దానికి సరియైన చైతన్యం సమకూర్చాలి. ఆధ్యాత్మికత దానికి అనంత శాశ్వతత్త్వాన్ని కలిగించాలి. ముప్పేటలుగా ఉన్న ఈ ప్రేమ, కడపటిదశలో ముప్పిరిగొని, ఏకత్వాన్ని పొందాలి. అట్టిప్రేమ సమగ్రమైంది. అటువంటి ప్రేమచిత్రణమే సమగ్రప్రేమచిత్రణం. ప్రేమ కావ్యభావన ఈ రీతిగా ఉండాలి ఇట్టిలక్షణాలు కొంతవరకైనా నా రచనలో ఉన్నాయో లేవో మీరే నిర్ణయించాలి.

కాని హైందవాభిరుచులు, ఇతిహాస రచనా నియమాలు, ఆలోచనా రీతులు, పాత్ర స్వభావాలు ఎంతగా ఒంటబట్టించుకొన్నా, హైందవ పురాణాన్ని ఆంగ్లీకరించడంలో తీవ్రావరోధాలు కల్గుతాయి. విషయంచుట్టు అనవసరమైద పదజాలం వ్యాపించే ప్రమాదం వుంది. పరిచితంగాని సందర్భోచిత సూచనలెన్నో వుంటాయి. ఇవన్నీ ఆంగ్లపాఠకులకు బుట్టకెక్కవు. ఇతః పూర్వం ఆంగ్లీకరించినవారు విశేషంగా 'స్థానిక చిత్రణ' వ్యామోహానికి లోనైనారు. లేదా సంస్కృత పదాలే అంతటా వుపయోగించి, ఘాటుగా రచన సాగించారు. అందువల్ల చదువరికి అడుగడుగునా అవరోధాలేర్పడ్డవి. చికాకు కల్గుతుంది వీనివల్ల. వస్తు స్వభావానుకూలంగా, సహజత్వం దెబ్బ

తిననంత మేరకు స్థానిక చిత్రణం సరిపడవచ్చు. అనువాదభాషలో బొత్తిగా అనుకూలమైన పదం లభించనప్పుడే మూలభాషా పదప్రయోగం సమర్థనీయ మౌతుంది. అట్లా కాకుండా, తరచుగా మూలభాషా పదప్రయోగం చేయటం అనువాదకుని సోమరితనాన్ని సూచిస్తుంది. ఆతని నిరుపయోగ పాండిత్యానికి నిదర్శనమన్నా అవుతుంది. సాంకేతిక పదాలను మినహాయిస్తే, ఆంగ్లానువాదాతీతమైన సంస్కృత పదాలుకాని, భావాలుకాని పరిమితంగానే కనిపిస్తాయి. సూటిగా అనువదించటం కుదరనపుడు కొంత సర్దుబాటు చేసుకోవచ్చు. అదీ సాధ్యపడకపోతే, సంస్కృత పదంతోగాని, భావంతోగాని, సమానార్థకమైనదాన్ని కల్పించవచ్చు. అది ఆంగ్లపాఠకునకు సుపరిచితమైనదిగా ఉండాలి. అధిక పరిశ్రమతోకూడిన శబ్దాడంబరత్వంకన్న, యత్కించిత్ అసమగ్రతే మిన్న. అందుచేత నేను అనవసరమైన స్థానికపదాల నెన్నుకోలేదు. శబ్దాడంబరత్వాన్ని ప్రదర్శించటానికి ప్రయత్నించలేదు. ఒక్కొక్కప్పుడు ఆంగ్లపదం లభించకపోతే గ్రీకు పదాన్ని ఎన్నికచేశాను. ఉదాహరణకు 'అ ధో లో కా ధి ప తి' అనటానికి "హేడ్స్" అనే గ్రీకుపదం ప్రయోగించాను. ఇలాంటి అనువాదం న్యాయమేనని భావిస్తాను. ఈ విధమైన అనువాదంవల్ల కావ్యం, పాఠకుని భావన కందుబాటులో వుంటుంది. ఇట్లా కాకుండా కొన్నిమాటలున్నాయి. వాటిని వదలుకోటానికి పాఠకుడు ఇష్టపడడు నామటుకు నేను "ఋషి, నాగ, అశ్వత్థ, చంపక, కోకిల, కృతాన్త, ధర్మా"ది పదాల్ని విడిచిపెట్టటానికి నిరాకరిస్తాను. కోకిలకు 'కుక్కూ' అని; అశ్వత్థానికి 'ఫిగ్'అని కొన్నింటికి తుల్యపదాలు లభించకపోవు. అయినా పాఠకుడామాత్రం మూలపదప్రయోగాల్ని సహించాలి. కవితానుభూతి, సానుభూతిగల పాఠకుడు అనివార్యంగా ప్రయోగింపబడిన హైందవ పురాణ సూచనలన్ని కొన్నింటిని అవగాహన చేసుకోలేకపోడు. నేను ఇట్టి సూచనలన్ని చాలా పరిమితంగానే చేశాను. వీనిలో ఒకటి రెండు మినహా, తక్కినవన్నీ బుద్ధికుశలత, సాను

భూతిగల పాఠకునికి అర్థమయ్యేవే. హైందవేతిహాసంలోని పరిసరాలు; దాని వివిధావయవ సంపత్తి యధాతధంగా పరిపోషింపబడాలి. సరిగా నిరూపింప గల్గాలేగాని, హిందూపురాణాలలో కవితాసౌందర్య సూచనగాని, శక్తిగాని, లోపిస్తుందని భావించనవసరంలేదు. భృగుని మనుమడు, రురుడు. ఆర్య నాగరికతా ప్రారంభకాలంవాడు. ఐరావతి, చంద్రభాగ, శతద్రు, వితోత్స, విపష అనే పంచనదీ పరిసరాల్లో నివసించి, యుద్ధాలుచేస్తు, వీరగీతాలాలపిస్తు ఉండేదప్పటి మనజాతి. అప్పుడు మనవంగభూమి మహానదీ ప్రవాహాలకు; క్రూర జంతుజాలయుత కీకారణ్యాలకు ఆకరమైంది. అక్కడక్కడ జాతులుగా ఏర్పడుతున్న ఆటవికులుతప్ప, మానవ నివాసాలు లేవు. మానవ సంతతికి భూమినిగూర్చి అంతగా పరిచయంలేని కాలంనాటిదీకథ. పురూర వాది చక్రవర్తులు; కులవృద్ధులైన ఋషులు— భృగు, బృహస్పతి, గౌతమా దులు, ప్రజాతంతువును వృద్ధిపొందించారు. మానవజగత్తున కానాడు 'ఋషే' అధిపతి. ఆ ఋషే— కవి, ఆరాధకుడు, శాస్త్రవేత్త, ప్రవక్త, విద్యావేత్త, పండితుడు, శాసనకర్త కూడా. అతడు ఏదైనా రచిస్తే, ప్రజలకది పవిత్ర మంత్రమౌతుంది. అతడు భగవద్ధ్యాన సమాధిలోఉండి, ఉత్థానుడై "వాక్యో చ్చాటనం" చేస్తే, అది యుగాంతరాలలో తత్త్వశాస్త్రానికి అంకురమౌతుంది. అతడోయజ్ఞాన్ని నిర్వహిస్తాడు. రాజులు, ప్రజలు, అందులోని సప్తజిహ్వాని జ్వాలా మహిమచే, అపారసంపద్విలసితులు, మహాశక్తిసంపన్నులు అవు తారు. అతడు పరిశోధనాత్మకంగా సూత్రరచన కావిస్తే, అది భవిష్యత్కాల ములో నైతికశాస్త్ర నిర్మాణానికి పునాది ఔతుంది. అతడు వివాదంలో తీర్పు నిస్తే— అదో శిక్షాస్మృతికో, శాసనానికో మూలమవుతుంది. హిమాలయా రణ్యాలలోగాని; నదీనద సంగమ స్థానాల్లోగాని; అతడు గురుకులాలునిర్మించి కులపతియై నయనోజ్వల కాంతిమూర్తులగు ఋషి పుత్రుల్ని; సాహసోపేతు లగు యువజనాన్ని, భవిష్యత్కాలములో మహర్షులై, జాతికి మార్గదర్శకులు

కానున్న జ్ఞానార్థుల్ని సంఘటితపరచి, మహర్షులుగానో, కర్మవీరులుగానో, జ్ఞానులుగానో సుశిక్షితుల్ని చేస్తాడు. వీరి యనుబంధం, రక్తసంబంధమైంది కాదు కానీ, ఆదానప్రదానాలతో కూడిన భావసంబంధమైంది. ఆ ఋషి సత్తముడున్నూ, సకల కళాకోవిదుడు, వివిధశాస్త్ర నిష్ణాతువు. ఋషులు తమ కఠోరైకాగ్రతచే సకలేంద్రియ శక్తుల్ని సమాహితం గావించుకొని, పవిత్రాంతఃకరణ ప్రవృత్తిచేత, సకల విజ్ఞానాన్ని కైవశం చేసుకోగలరు. అందువల్ల వారిలోని తర్కాతీత విశద దార్శనికత ప్రబుద్ధమౌతుంది. ఆంతరంగిక ప్రబోధంచేత ప్రవర్తితమయ్యే ఈ దార్శనికతా పునః పునః ప్రసారకాంతులు మహా తార్కిక భావతరంగ మాలగా రూపొందుతుంది. ఈ తార్కిక కుశలత కేవలం ఆలోచనకు, వాదప్రతివాదాలకు ఉపయుక్తమయ్యేదికాక, నిరంతరోత్తేజిత భావస్ఫూర్తి కుపకరించేది. పంచాగ్నులమధ్య వసించటం (నాలుగువైపుల అగ్ని - పైని సూర్యుడు), శలాకాగ్ర శయ్యలపై రోజుల తరబడి శయనించటం; భౌతిక శాస్త్రీయ ప్రగతి పద్ధతుల్లో యోగాభ్యాసం చేయటం వంటి నిష్ఠుర భౌతిక నియమాలవలన శాశ్వతత్వాన్ని అన్వేషించటం ఆధునికాచారమైంది. పూర్వ ఋషులు ఉత్తేజిత భావుకులు. కేవలం తర్కంమీద గాని, భౌతికేంద్రియ నిగ్రహంమీదగాని ఆధారపడేవారుకారు. వారి ఆత్మీయత గంభీరమైంది. భగవద్ధ్యాననిమగ్నులై, తీవ్రప్రతిఘటనల్ని నిరోధిస్తు, వర్ణనాతీత ఆధ్యాత్మిక శక్తియుక్తుల్ని సముపార్జించుకొన్నారువారు. అందువల్ల వారి కోపాగ్ని ఎందరినో భస్మీభూతుల్ని చేయగల్గింది. శపింప సంకల్పించి వారు పెదవి విప్పితే, లోకాలోకాలు ఆకులమౌతాయి. ఇట్టిశక్తి, వారసత్వముగా తరువాతి తరాలకుకూడా సంప్రాప్తించింది. వారిసంతతిలో కొంతవరకు నిగూఢంగానైనా ఉంది. కాలపరిణామంలో యీ ఆంతరంగికతేజస్సు క్రమక్రమంగా క్షీణించింది. ప్రారంభంలో గర్భస్థశిశువుకు కూడా దివ్యత్వం ఉండేది. భృగుమహర్షికి 'పులోమ' అనే రాక్షస స్త్రీతో వివాహంకావటానికి

పూర్వం ఆమెనో రాక్షసుడికి ఇవ్వాలనుకొంటారు. కాని అలా జరుగలేదు. తరువాత భృగుమహర్షి యామెను పెండ్లాడాడు. చ్యవనుడు పులోమగర్భంలో ఉండగా, ఆ రక్కసుడు 'పులోముడు' ఆమెను మహర్షి లేని సమయంచూచి. వరాహరూపంలోవచ్చి అపహరిస్తాడు. అప్పుడు శిశువు చవనుడు, ఆ అవమానానికి బాధచెంది బహిర్గతుడై, సాంప్రదాయికంగా సంప్రాప్తమైన ఆధ్యాత్మిక శక్తి మహిమతో కోపించి, శపించగా, పులోముడు భస్మమైపోతాడు ఋషులు కేవలం అనుద్వేగులుకారు. వారికీ కోపతాపాలున్నాయి. జీవితంపై విశేషాభిమానం గల్గిన ధీశాలురు వారు. సౌందర్య తృష్ణతో రాక్షస స్త్రీలను వివాహమాడారు, అప్సరసలతో కొండకోనల్లో నిర్జనారణ్య సీమల్లో ప్రేమ డోలికల్లో ఏకాంతంగా విహరించారు. భృగు, బృహస్పతి, గౌతమ, కశ్యపాదులీ మహర్షుల కావిర్భవించినవారే. చరిత్రకందని కాలంనుండి యిప్పటి వరకున్న ఆర్యులు. ఈ పవిత్ర ఋషిసంవతివారే, తమకు నాగరికతను ప్రసాదించిన మూలపురుషులైన ఋషుల్ని, ఇప్పటికీ, నిత్యం భారతీయులు కృతజ్ఞతా భావంతో సంస్మరిస్తారు. వారికి దైవత్వాన్ని ఆపాదిస్తారు.

భూమిమీద ఋషులు, స్వర్గంలో దేవతలు, గొప్ప తేజోమూర్తులు. దుష్ట నిశాటుల విశృంఖల విహారభారంనుండి వీరు విశ్వాన్ని సంరక్షిస్తారు. సురాసురుల కవిరామంగా విరోధముంటున్నా, అప్పుడప్పుడు వీళ్ళు మైత్రీ భావంతో ఉండేవారు. ఇంద్రుని దేవేరి శచీదేవి పులోముడనే రాక్షసపుత్రియే. దైత్యారియైన యయాతి, దైత్యదుహిత శర్మిష్ఠను (వృషపర్వ మహాప్రభు పుత్రి) పరిణయమాడాడు. భృగుపత్ని పులోమది రాక్షసవంశమే. దేవతానాయకుడైన ఇంద్రుడు మేఘాధిపతి. యజ్ఞముఖాన మానవులు సమర్పించే సోమరసాన్ని ఆస్వాదించి, వర్షంకురిపిస్తాడు. గాలికి అధిపతి వాయుదేవుడు. హుతాశనుడు స్వాహాప్రాణనాథుడు, ఆధ్యాత్మిక శక్తిసంపన్నుడు. జలాధిపతి వరుణుడు. మృత్యుదేవత, కృతాన్తుడు. ఇతడే యముడు, అనగా ధార్మిక

పరిపాలకుడు, నైతిక వాస్తవిక ధర్మసంచాలకుడు. కాముడ్నే మదనుడని, మన్మథుడని అంటారు. ఇతడు శుకవాహనుడు, పుష్పశరుడు. భ్రమరశింజినీ వినాద ప్రమోదభరితుడు. సకల వాంఛల కధిపతి, రతీప్రియుడు. రతీదేవి స్వర్ణాంగి, అతిలోక సౌందర్యవతి, నిరంతర ప్రేమానందమయి. హైందవ వాగ్దేవత సరస్వతి. ప్రఫుల్ల భావస్వరూపిణి. అప్రకటిత నామరూపాత్మక జగత్తునకామె భావప్రకటనమే ఆధారం. ఎందుకంటె వాస్తవికతకు పూర్వమే వాక్కు ప్రవర్తిల్లింది. అందుచే వాస్తవికతకన్న వాక్కే సత్యమైంది, తాత్త్వికమైంది. సరస్వతి బ్రహ్మపుత్రి; తన తండ్రినుండి సృజనాత్మకశక్తిని సంతరించుకొన్నది. భర్తవలె లోకసంరక్షకురాలు లక్ష్మీదేవి. వాసుకి నాగ రాజు. భూభారాన్ని వహించే ఆదిశేషువు సహస్రశీర్షుడు. ఇతడు పరిమిత శక్తి, దేశకాలాలకు ప్రతినిధి. విరాట్‌స్వరూపుడు, విశ్వాకారుడునైన విష్ణు మూర్తికితని శరీరం మృదుశయ్య. దేవతలకన్న కొంచెం తక్కువస్థాయి లోనివారు దేవదూతలు. వీరి సేవకులు యక్షులు. వీరు, ధనాధిపతి కుబేరుని అపార ధనరాసుల్ని సదా సంరక్షిస్తుంటారు. సౌందర్య నిదానమైన అలకా పట్టణం కుబేరుని రాజధాని. స్వర్ణ తుషారావృత గిరులతోకూడిన ఈ నగరం దేవదూతాధిపతులకు ఆవాసం. భౌమికస్పర్శ నెరుగని చంద్ర కిరణావళిని చుంబించే సౌధరాజాలకిది ఆలవాలం. ఇంద్రనీలమణితోను, విదియనాటి చంద్రునితోను తుల్యంగా ప్రకాశిస్తుంది ఆ పురవాసుల ఫాలభాగం. వారికి ప్రేమతప్ప అన్యభావం పొడగట్టదు. వీరు నిత్య యౌవనులు; వయోవృద్ధి లేనివారు. వసంతంతప్ప అన్య ఋతువులు వారెరుగరు. గంధర్వులు మృదు మధుర మనోహర సౌందర్యమూర్తులేకాక, వీరోచిత స్వభావులు; కవులు, కళాకారులు, గాయకులుకూడా. కిన్నెరులాకాశ సంచారులు, గిరిశిఖర నివా సులు. సుకుమార గాత్రంతో రాళ్ళు కరిగేటట్లు గానంచేస్తారు. క్షీరసాగర సముద్భూతలు అప్సరసలు. స్వర్గధామంలో దేవతల్ని తమ అపూర్వ గీత

నృత్యాలతో అహరహం అలరింపచేస్తారు. వీరప్పుడప్పుడు మానవులతో ప్రేమకలాపాలు సాగిస్తారు. త్రివేణీసంగమ పరిపూత చరిత, ఆర్యజీవన ధాత్రి. పవిత్ర గంగానది విస్మరింపరానిది. భూలోకంలో దీనికి భగీరథి, జాహ్నవి అనికూడా వ్యవహారం. నాగరాజ్యంలోను; యమరాజ్యమైన మృత్యులోకంలో దీనికి భోగావతి, వైతరణి అని వ్యవహారం. వాగ్దేవి సరస్వతితో తుల్యానామంగల 'సరస్వతి' అనే స్రవంతి. గంగతో తుల్యమైన పావిత్ర్యంగలది. కాని దీని కూలాలు అనార్యజనావాసంచే అపవిత్రంకాగా, ఆర్యజనులు దీని నుపయోగించలేదు. అందుచే ఈ స్రవంతి అంతస్స్రవంతియై, ప్రయాగవద్ద గంగా యమునలతో సంగమించింది.

ఇట్టి యీ పరికరాలు ఉత్తమ కవితారచనకు యోగ్యమైనవి కావా? ఇట్టి వస్తుసముదాయాన్ని ఉపయోగించి, కళాకారుడు శాశ్వతకావ్య సౌందర్య దృశ్యాలు కల్పించలేడా? ఇవన్నీ అట్టి యోగ్యతగల కవితా వస్తువులేయని సంతోషపూర్వకంగా చాటగలను. భ్రాంతికాని, ఆత్మవంచనకాని ఆవంత కూడా లేదిందులో. ఏవంవిధ వస్తుసముదాయ మాధారంగా గతానుగతిక రచనలుకాక, వినూత్న కావ్యజాలాన్ని సృష్టించవచ్చు.

"మానవుడ్ని ఉన్నతస్థాయిలో నిల్పి విజయోపేతుడ్ని గావించేది వాక్కు- ఈ వాక్ప్రసారం ఆత్మసంస్కారాన్ని కల్గించేదికాక, జగత్కల్యాణాన్ని సమకూర్చేది".

"ఇదంతా అంగీకరిస్తాను. కాని నా అభిరుచికి, మనోభీష్టానికి, విరుద్ధమైన గ్రంథాన్ని నేనెట్లా అంకితం చేసుకొంటాన"ని నీవు నన్ను ప్రశ్నించవచ్చు. కాని బహుమతి, పుచ్చుకొనేవానికన్న, ఇచ్చేవాని మనస్సు ననుసరించే వుంటుంది. నీకు నేను ఎంతకాలంనుండో వైజ్ఞానికంగా ఋణ

పడి వున్నాను. ఆ ఋణానికి కొంత చెల్లుబడిగా ఈ కావ్యాన్ని స్వీకరించ గలవా? నీకు తెలీకుండానే, బాల్యంనుండి నాకెంతో బోధించి నేను కవిని కావాలని ఆకాంక్షించావు. ఎంతగానో ప్రోత్సహించేవాడివి. నీలోని విజ్ఞాన జ్యోతి, ఆత్మవిజ్ఞాన జ్యోతిని వెలిగించింది. నీవు చూపిన బాటలో తప్పటడుగులు వేసుకొంటు, అనిశ్చిత యాత్రను చిరకాలం సాగించాను. నేడు నేను అనివార్యమైన అభ్యుదయమార్గంలో స్వతంత్రంగా పయనిస్తున్నాను. బహుశః ఈ మార్గం, పూర్వపథంకన్న విశేషంగా కంటకావృతమైందే కావచ్చు, ఒడుదుడుకులతో కూడుకొన్నదే కావచ్చు. అయినా అది నా స్వకీయమార్గం. అంతమాత్రంచేత నీవు తొలుత చూపిన ఆదర్శజ్యోతిని విస్మరింపలేను. అందుచేత ఆ నా ఋణం తీరిందని భావించటంలేదు. నీ ప్రశాంత కాంతిపూరిత మేధాశక్తి, నీకు ఏనాటికైనా శాశ్వతకీర్తిని సంపాదించవచ్చు. ఆ కీర్తి దిక్చక్ర కాంతిలో నా పేరుకూడా చిన్న కిరణంగా ప్రకాశించనీ. నేను తొలిసారిగా రచించిన ఈ కావ్యం, నీ కంకితమైందనే విషయం నీ స్మృతి పథంలో ఉండటం నీ కంతగా హానికరం కాదనే అనుకొంటాను.



# భారతావని

భారతదేశము తన ప్రాచీన భావములనే శక్తిమంతములైనవిగను, అన్యోన్యములైనవిగను, పూర్ణత్వము గలిగినవిగను వ్యక్తపరచ వలయుననిన తన స్వసంస్కృతీ రూపములకు నూతన ఆకారముల నొసంగి తనను తా రక్షించుకొనవలయును. అందుచే ఒకానొకప్పుడామె యీ సర్వ భూమండలమునకు మార్గదర్శియై, జ్ఞానదీప్తి నొసంగియున్నదగుటచే పునః తన ఆధ్యాత్మిక విజయ యాత్రయనెడి జ్యోతీతరంగములచే ప్రజ్వరిల్లి, దిగ్విజయముగ సర్వవ్యాప్తమై, సర్వ ప్రపంచమునకును విమోచన మొసంగగలదు.

* * *

వివిధములైన ఆటంకము లేర్పడుచున్నను భారతీయ సంస్కృతీ ప్రభావము, భారతీయ కేంద్రలక్ష్యము, తదున్నత భావములు, తమ సందేశమును వాక్కు భారతీయులకేగాక సకల మానవులకును అందించుచునే యున్నది.

— శ్రీ అరవిందులు

# కళలలో జాతీయత

సౌందర్యోపాసనాదృష్టిని తిరస్కరించి, కేవల ప్రయోజనము నపేక్షించుచేపే యాధునిక విధానముగ నీ మధ్య మన దేశమునఁ బరిగణింపఁబడెను. ఈ విధానమును యూరపు ఖండము తాననుభవించిన రసానుభవ శిక్షణమును, నూతన సంస్కృతీ సంప్రదాయ సంపదనుఁ బురస్కరించుకొని పరిహరించినది. భారతదేశమున కీ యనుభవము క్రొత్తదికాదు. చాల ప్రాచీనకాలముననే యీ దేశమునందు రసానుభవానందము పరాకాష్ఠము నధిష్ఠించినది. కాని యీ మధ్య పర పాలనముచేఁ బ్రవేశపెట్టబడి, ధన సముపార్జనా లక్ష్యసంవలితమైన నిర్జీవ విద్యావిధానముచే నీ ప్రాచీనసంప్రదాయములకు బ్రహ్మాండమగు నాఘాతమేర్పడినది. సౌందర్యోపాసనమునకు మారుగా నీ విద్యావిధానమందు విపరీతమగు నూహాశక్తి ప్రాబల్యము వహించినది. భావోద్రేకము పెల్లుబికినది. సుకుమార తత్త్వచింతనము మాత్రమే తల యెత్తినది. అయినను నీ సౌందర్యదృష్టి జాతి స్వభావమున నిగూఢమై యున్నదేకాని, రూపఱలేదు. అది భారతీయుల సుకృత విశేషము.

మన ప్రాచీనులు, సంగీతమునకు, శిల్పమునకు, కవిత్వమునకును ఎంత విలువనిచ్చిరో యీ కాలము వారి కర్థముకూడ కాదేమో!! అందులకు కారణము ఈ కాలమువారికి జీవితపరమార్థ మవగతము కాలేదు. కేవల భౌతిక సుఖానుభవమే వారికి సర్వోత్కృష్టముగ గోచరించును. భౌతిక విభూతి, మానవాభివృద్ధికి ప్రాతిపదికయే. ఏ జాతికైన తొలుదొల్త కడుపు నిండ తిండి, తలదాచుకొనుటకు నీడ, కట్టుకొనుటకు వస్త్రము లత్యంతావసరములే. ఇవి యేర్పడిననాఁడే జాతికొక యస్తిత్వమేర్పడును. ఈ సమస్యను మన ప్రాచీన సామ్యవాద మానవసంఘములు పరిష్కరించినవి. మానవ

జాతిలో ముప్పాతిక ముప్వీసము ఏతత్సమస్యా పరిష్కారమునకే పాటుబడు చున్నది. ఏ కొద్దిమంది బుద్ధిమంతులో దీని నతిక్రమించి యున్నతి నార్జించుటకు తహతహలాడుదురు. అత్యవసరమగు నీ సహజవాంఛలు, సర్వసాధారణమైనవి, పాశవికమైనవి, విపరీతమైనవి, విచక్షణా రహితమైనవి. ఇవి మనకును, పశుపక్ష్యాదులకును సమానమైనవి. దీనినే మన వేదాంతము 'ప్రాణమయకోశమ'ని వివరించినది. ఇట్టి అత్యవసర వాంఛల నాధారించుకొనియే, ధనపిపాస, భోగతృష్ణ, కామినీకాంక్ష ఉద్భవించినవి. మానవేతర జాతులు కుక్షింభరత్వమునకే సతమతమగుచుండ మానవజాతి, నాగరికతోపేతమై, సుస్థిరమగు నార్థికవ్యవస్థను సాధించి, వ్యక్తిగతమగు నాస్తిపాస్తుల నార్జించినది. తన్మూలమున, సాంఘికమగు నసమానత్వము, నన్యాయము, దౌర్జన్యము, వంచన, పరస్పర విద్వేషము, వ్యక్తి సంబంధము, కుటుంబ సంబంధము, వర్గ సంబంధమునగు స్వార్థపరాయణత్వము చెలరేగి యివి యన్నియు మానవాభివృద్ధి కనివార్య మనిపించినవి. జగన్మాత సదసత్తు మూలమున జగత్క్రియను జరిపించును. క్షణికమగు నసత్తు మూలమున నామె జగత్కళ్యాణమును సమకూర్చును. పాశవిక మనఃప్రవృత్తు లీ రీతిగా కాలక్రమమున జగత్తు నుల్లోల కల్లోలిత మొనర్చినవి. రాగద్వేషములు, కామక్రోధములు మున్నగు ప్రాణసంబంధమగు నుద్రేకములు సామాజికముగా కాక, వైయక్తికముగ తృప్తిని సాధించుచుండెను. ఇట్టి యుద్రేక వాంఛలను దీర్చుటకే యాధునిక జాతులు, సంఘములు, ప్రపంచమున మను చున్నవి. అందులకే వర్తక వ్యాపారములు దినదినాభివృద్ధి నందుచున్నవి. భౌతికశాస్త్రములుకూడ మానవజాతికి సౌఖ్యమును, భోగసంపదను సమకూర్చుటకే పరిశోధింపఁబడుచున్నవి. ఇట్టి వాంఛా పరిసమాప్తికే వ్యక్తిగత సంపదలు, బానిస విధానము నమలులోనికి వచ్చినవి. ఇట్టి భౌతికేచ్ఛా సంతుష్టియే జాతులకు జాతులకు సన్నిహితత్వము నేర్పఱచుచున్నవి. ఈ

యిచ్ఛా పరిసమాప్తి విశ్వతోముఖముగ సిద్ధింపనిచో ప్రపంచ రాజ్యములందు విప్లవములు చెలరేగును.

బానిసవిధానము మధ్యయుగములందు పరిహరింపఁబడినది. ఏలయన మానవహృదయశక్తి ప్రవర్ధమానమైనది. నైతిక, మత, వేదాంత ప్రభావము వ్యక్తిని, జాతిని అతిక్రమించి సర్వమానవసృష్టి నలముకొన్నది. అందుచే బానిసవిధాన స్థానమునందు కూలీ పద్ధతి వచ్చినది. తన్మూలమున మానవు లైచ్ఛికముగా బానిసతనమును వలచి, యుదరపోషణము గావించుకొను చుండిరి. ఈ విధానముకూడా క్రమముగా నీరసింపఁజొచ్చినది. సర్వమానవ జాతియు నేఁడు ఉదరపోషణముతోఁ దృప్తిజెందక, అనఁగా అన్నమయ కోశము నతిక్రమించి ప్రాణమయ, మనోమయ కోశములందు యథేచ్ఛగా సంచరింపవలయునని యుత్కంఠించుచున్నది. ఉత్తమవర్గమునకుఁ జెందిన కతిపయ మానవులు నిత్యజీవితము లందనుభవించు భోగభాగ్యములను తాము ననుభవింపవలయునని, సర్వమానవులును నేఁడాకాంక్షించు చున్నారు. ఇవియేకాదు; జాతీయ సౌభాగ్యమును, ప్రభుత్వమును, యుద్ధ నీతులను, రాజలాంఛనములను, దాముకూడ పంచుకొనవలయునని సర్వ మానవులు పటుపట్టినారు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, స్వాతంత్ర్యము— సమానత్వమను రెండింటికి సామరస్యముగూర్చి సాధ్యమైనంతవఱకు ప్రజల కందఱకు నందుబాటునకుఁ దీసికొనిరావలయును అను నుద్యమము సర్వత్ర సాగినది. ఇట్టి యాశయమే రక్తపాతసహితమై ఫ్రెంచివిప్లవముగా రూపొందినది. ఈ ప్రజాస్వామ్యమును, ఈ సామ్యవాదమును, ఈ యరాజ కమును నెదుర్కొనుటకు ధనికోన్నతవర్గము సర్వశక్తుల ప్రయత్నించినది. తాత్కాలికముగ కొంత యవరోధము కలిగినది. కాని కాలప్రవాహము నరి కట్ట నేరి సాధ్యము? భూతకాలముకన్న భవిష్యత్కాలము శక్తిమంతమైనది. పరిణామ పరిభ్రమణ మప్రతిహతముగ సాగును. దాని సంచాలనము నడ్డ గించునవన్నియు నందే హతమై తీరును. దానితోఁ బోరాడుటన్న భగవం

తుని సంకల్పము నెదుర్కొనుటయే; భగవచ్ఛాసనమును దిరస్కరించుటే. కారణజగత్తులో నితఃపూర్వమే యిట్టి దుష్టశక్తులు పరాజయ మందినవి. "నిహతాః పూర్వమేవ" బాహ్యజగత్తున వాని కార్యరూపమును మాత్రమే సందర్శింతుము.

సర్వసాధారణమగు మానవకోటి యిట్టి భౌతికవాంఛల నతిక్రమింప లేదు. దాని భావనకూడ నీ భౌతికస్థాయి నధిగమించదు. హిందూతత్త్వ మిట్టి యావరణనే 'మనోమయ కోశమ'ని పేర్కొన్నది. సర్వమానవ సామాన్యము, కతిపయ జీవజాలము నీ కోశమునుండి తమ సమస్త వ్యవ హారములను నపరించుకొనును. ఇట్టి మనోమయ కోశము నతిక్రమించి మానవునకు బుద్ధి, లేక భావన యనునది కలదు. ఇట్టి బుద్ధిని పరిశుద్ధ మొనర్చుకొన్నచో అది మనోదేహముల నతకరించి స్వతంత్రముగ వర్తిం చును. ఉద్రేకములన్నియు శాంతి వహించును. కొలది మంది మనుష్యులు మాత్రమే యీ బుద్ధియను నింద్రియము నభివృద్ధిఁ గావించుకొనఁగలరు. అందును కొలదిమందియే దానిని పరిశుద్ధమొనర్చుకోగల సమర్థత కలిగి యుందురు. ఘనమైన యోచనాశక్తిగలవారు, కొన్నిగంటల పరిమితివఱకును భౌతికావరణమును కొంతవఱకు నతిక్రమించి, యీ బుద్ధీంద్రియమును స్వతంత్రముగ వినియోగించుకొనఁగలరు. కాని యా యల్పకాలమునందును వారి భావన యవిచ్ఛిన్నముగ సాగునని తలంపలేము. దైనందిన జీవిత నీరసభావము లీ పరిశుద్ధ భావస్రవంతి నడ్డగించుచునే యుండును. అయినను పరిణతులైన యోగులు కొంద ఱీ విశుద్ధబుద్ధితో సదా రమింపఁగలరు. ఈ విశుద్ధబుద్ధి చిత్తశుద్ధివలన సంక్రమించును. శాంతవికము, శక్తిమంతము, నుద్రేకపూరితము నగు ప్రాణమువలన నేర్పడిన చిత్తము సదా కల్లోలితమై యుండును. దానిని ప్రశాంతమొనర్చిన చిత్తశుద్ధి కల్గును. సామాన్య మాన వుల బుద్ధి, భౌతికవాసనల నతిక్రమింపని మనస్సుతో నిండియుండును.

మానవజాతిలో నధికసంఖ్యాకులు యోజింప సమర్థులుకారు. వారికి కొన్ని యాలోచనలు మాత్రముండును. కొందఱు మాత్రమే యవ్యవస్థితముగఁ జింతింపఁగలరు. వీరు తమ వాంఛలను, యభిమానములను, కామోద్రేకములను, పూర్వపరిచయములను, రాగద్వేషములను జిందరవందర కలిపి, తమ భావనను కలగాపులగ మొనర్తురు. అతిస్వల్ప సంఖ్యాకులైన భావుకులు మాత్రమే యచంచలమగు నాంతరదృష్టితో తమ ధీశక్తిని ప్రదర్శింతురు. వీరే నిజమైన నిరంకుశులు. వీరి నిరంకుశత్వము భౌతిక సంబంధమైనది కాదు. అభిజాత్యమునకు సంబంధించినది కాదు. ధనమదాంధతచే సంక్రమించినదికాదు. తీవ్రోద్రేకబలము వలనగాని, పదవీవ్యామోహము చేతగాని యేర్పడలేదు. ఇది కేవలము విజ్ఞాన సంబంధమగు నిరంకుశత్వము. ఏ కాలమునందైన నిట్టి నిరంకుశవాదు లుద్బుద్ధమౌదురు. మానవసమాజమున నీ యసమానత్వ మఖండమగు ప్రాముఖ్యమును బడయకతప్పదు.

బుద్ధి నతిక్రమించియు కొన్ని యితరశక్తులు కలవు. వాని నన్నింటిని కలిపి మనము స్థూలముగ నాధ్యాత్మికత్వమని వ్యవహరింతుము. ఇట్టి శక్తులు గలవారు కోటికొక్కరు గానవత్తురు. బుద్ధిమంతులుగాఁ బరిగణింప బడువారిలోగూడ నీ శక్తులు సమగ్రముగ వికసింపవు. మేధాకుశలతను, భావనాపటుత్వమును, ఉద్రేక తీవ్రతనే యనేకు లాధ్యాత్మిక సంపదయని భ్రమింతురు. ఆధ్యాత్మికత తదతీతమైనది. అయ్యును వీని నన్నింటి నంతర్భుక్తము గావించుకొన్నది. ఇది సర్వసృష్టికిని కారణభూతమైనది. దానిని సముపార్జించుటయే మానవ చరమలక్ష్యము. ఇట్టి ఆధ్యాత్మికార్ణవ తరంగములు కతిపయ మానవ హృదయ క్షేత్రముల యందనేక పర్యాయములు తరంగితమైనవి. అట్లగుటలో గల లక్ష్యము, తక్కిన మానవజాతికి చైతన్యమునుఁ బ్రసాదించి, శాంతచిత్తులను గావించుటయే॥ దీనినే మతమని సాధారణముగ వ్యవహరింతుము. ఇట్టి స్థితికి పూర్వము బుద్ధిసంపదయే

